Presented by Maharaja of Bobbili G.C.I.E.

శ్రీకృష్ణ



# శ్రీకృష్ణులవారు

## వారినిగురించి మనముపడియెడి దురభిప్రాయములు.

## సభాసదులారా! 8

శ్రీకృష్ణులవారిని గురించి మనము సాధారణముగ నభిప్రాయపడి యుండునట్టియు నసత్యములైనట్టియు వారి వారికి దోచినటుల వాడుకొనబడుచున్న విషయములను గనబరచబోవుచున్నాను. ముఖ్యముగా హిందువులమగు మనమేగాక ప్రతి మతముల వారును సంతు విశేషించి నిష్పక్షపాత బుద్ధిగల వారు ఏదైతే యమానుష కృత్యముగ నుండునో దానిని సుతరాము విడిచి పెట్టవలయును. ఇది ప్రతిమనుష్యుడు ముఖ్యముగ మనస్సునందు నుంచికొనవలసిన నీతి యయియున్నది.

శ్రీకృష్ణులవారి కాలమింతయని యేశాస్త్రజ్ఞులవలన నిదివరకు నిస్సందేహముగ నిశ్చయింపబడియుండలేదు. కొందరు యూరోపు దేశపు విద్వాంసులు క్రీస్తుశకమునకు ముందు 14 శతాబ్దముల శ్రీకృష్ణులవారి కాలమని యేకాభిప్రాయులైరి. మరికొందరు క్రీస్తుశకమునకు ముందు 15 లేక 12 శతాబ్దములని చెప్పిరి. ఇప్పటి కాలపు కలకత్తాలోనుండిన 'ధీరేంద్రనాద్' గారు శ్రీకృష్ణులవారి కాలము క్రీస్తుశకమునకు

ముందు15--16 శతాబ్దముల మధ్యకాలమై యుండునని సమ
ర్థించిరి. అతడు రచించిన శ్రీకృష్ణులవారు వారి జీవితకాల
ము వారిబోధనలు' ననుపుస్తకమును ప్రారంభము మొదలం
ముపరకు జదువుటకు మిమ్మును ముఖ్యముగ వేడుచున్నాడను.
శ్రీకృష్ణులవారి కాలము ద్వాపరముయొక్క యంత
మందుగాని కలియుగముయొక్క యాదియందుగాని అనగ
5006సంవత్సరముల క్రిందట యని మన హిందువులు సాధా
రణముగ నమ్మియున్నారు. ఎటులనైన ననేక సహస్ర సం
త్సరములై యుండునుగదా; మరియు మన పురాణము లన్ని
యు నేక కాలమందుగాని, యొక పురుషునివలనగాని వ్రాయ
బడినవి కావు. ఈ పురాణములలో మనచే ననుకొనబడుచుండు
సృష్టికాలము మొదలతిసాహసముతో ముందురాబోవు నన
గా నీయుగాంతమువరకును సంగతులు వ్రాయబడి యున్నవి.
అందుల విషయములనుబట్టి మనకవకాశమగు నన్నివిధముల
నాలోచించి చూచెదము. మహాభారతము భారతయుద్ధము
జరిగినబిదప ననేక శతసంవత్సరములు గతించినపైని వ్రాయ
బడినట్లున్నది. ఇది యర్జునునికి ప్రపౌత్రుడగు జనమేజయమహా
రాజునకును భాగవతము గ్జనునికి పౌత్రుడగు బరిక్షిన్మహా
రాజునకును నప్పటి ఋషులవలన గథారూపముగ జెప్పబడి
నట్లు ప్రారంభింపబడి యున్నది. ఆకథలు శ్లోకరూపముగ మ

D22:2213:9 (3)
D4

రి యెంతో కాలమునాడు చేయబడియుండి యుండవచ్చును ఆ కాలమందును అటుతరువాతను ననేకభాగములు కలుపబడి యుండినటుల గనబడుచున్నది.

అన్ని పురాణములలోను భాగవతము విష్ణుపురాణము మహాభారతము హరివంశము శ్రీకృష్ణులవారిని గురించి చెప్పబడియున్న ముఖ్యములైన గ్రంథములై యున్నవి. అందు భాగవతము సాధారణముగ విష్ణు చారిత్రమును గురించి 12 స్కంధములుగ బుట్టియున్నది. అందుపదియవ దానియందు నీశ్రీ కృష్ణుల వారిచరిత్ర వ్రాయబడియున్నది. అదియు శ్రీకృష్ణుల వారి పిదప ననేక శతసంవత్సరముల క్రిందట వ్రాయబడి యుండినందున నందులో మనుష్యస్వభావ శక్తికి మించినయనేకములైనయూహాలతో జేరిన కథలు గలవు

మహాభారత మనునది పాండవులతో సంబంధించిన శ్రీకృష్ణులవారి చారిత్రమునే చెప్పుచున్నయది, గాని వారి నిమిత్తమయియె పుట్టినది కాదు, తక్కిన రెండు గ్రంథములయందును శ్రీకృష్ణ చారిత్రమె ప్రధానముగ వ్రాయబడి యున్నది, గనుక భాగవతముకంటె నీమూడు గ్రంథములయందును మనము హెచ్చు ప్రామాణ్య బుద్ధినుంచవలయును. ఈ మూడింటలో మహాభారతము పాండవులతో సంబంధించి నప్పుడు మాత్రమె శ్రీకృష్ణులవారి కథను జెప్పుచున్నది.

కావ నిక్కముగ పాతతరమైన గ్రంథమని యెంచవచ్చును. ఈ గ్రంథములు శ్రీకృష్ణులవారి కాలము పిదప ననేక శతసంవత్సరముల తరువాత వ్రాయబడినవని నందుకు రుజువుగా నేనొకటి రెండు దృష్టాంతములను జూపింపుచున్నాను. వానిని బట్టి యీ పురాణములలో గల పరస్పర భేదమును, అందుమూలమున మన మనస్సుల నాటియున్న యసత్యపు భావనలను దెలియును.

(1) శ్రీకృష్ణులవారు బాల్యమునందు 'బూతన'వలన జంపబడక విడువబడెనని యున్నదిగదా; భాగవతములో బూతన ఖేచరిగా శ్రీకృష్ణులవారిని జంపుటకు వచ్చెనని చెప్పబడి యున్నది. హరివంశములో నాపూతన కంసుని దాదియని చెప్పబడియున్నది. భాగవతములో మరియునది భయంకరమైన రాక్షసియని చెప్పబడి యున్నది. అయితే విష్ణుపురాణములో బిడ్డలను జంపునది యని మాత్రము చెప్పబడి యున్నది. శిశు ఘాతినియను నామమునకు బదులుగా కంసుని దాదియని హరివంశములోను భీతికరమైన రాక్షసియని భాగవతములోను జెప్పబడి యుండును. ఇట్లుండగా ధీరేంద్రనాథ్‌గారు పూతనయనునది యొక విధమైన భయంకరమైన శిశు వ్యాధి యని చెప్పుచు వైద్యవిషయమున బ్రశస్తములగు గ్రంథములలో నొకటి యగు శుశ్రుతమను దానిలోని

దమొక వ్యాధియైనటుల జెప్పబడిన దని గొప్ప యాధారములు
గనబడచిరి. మరియు పూతనయను శబ్దము స్త్రీలింగము. ఆహే
తువచేత భాగవత- హరివంశ- కర్తలిది రాక్షసి యని-కం
సుని దాదియని బహుశః వ్యవహరించి యుండుడు విష్ణుపురాణ
ములో శిశుఘాతినియని మాత్రము చెప్పబడియున్నది గాన నా
గ్రంథకర్తలా వ్యాధిని రాక్షసిగాను దాదిగాను - నేవిధముగ
భ్రాంతి నొందిరో చూడుడు. తమ భ్రాంతిని స్థాపించుటకుగా న
సంద్భపు కథను పూతనను గురించి కల్పించిరి. ఈ పైయుదా
హరణము బట్టి శ్రీకృష్ణుల వారిని గురించి వ్రాయబడిన చరిత్ర
యనేక సంవత్సరముల పిదప వ్రాయబడిన దనుసదియు నాగ్రంథ
కర్తలొకవిధముగ జరిగిన వారిని బొరపాటున మరియొక విధ
ముగ దీసికొనిరనియు- వారట్టి విరుద్ధాభిప్రాయములను స్థా
పించుట కెట్టి కథలను జేర్చినదియు మీకిప్పుడు విదితమేగదా!

(2) మరియు పైచెప్పబడిన యన్ని గ్రంథముల యందును
శ్రీకృష్ణులవారు కాళియ నామముగల నాగాధిపతి యను
నొక గొప్ప సర్పముతో యుద్ధము జేసి నాగస్త్రీల యొ
క్క ప్రార్థనపైని ప్రాణములతో నా నాగాధిపతిని విడి
చిపెట్టెనని చెప్పబడి యున్నది. నాగయను శబ్దము సర్పము
ననువర్తించును. అందువలన యాగ్రంథకర్తలా కాళీయుని
సర్పము క్రింద భ్రమసి తీసికొనుచు నాస్త్రీలను వర్ణించుట

లో వారు మాటలాడు శక్తిగల వారనియు విలువగలకర్ణ హస్త పాదాభరణములను ధరించి యుండిరనియు వర్ణించి రి. పాములైనచో వానికి గర్ణములు హస్తములు పాదము లు నుండునా! అవి యట్టి యాభరణముల నెటుల ధరించెను అయితే వారెవరనిన యమునా నదీ తీరపు టడవులలో ని వసించు నాగులను పేరుగల యొకజాతిప్రజలై యున్నారు. అందునుంచియొకడా శ్రీకృష్ణులవారు కాళీయు, నాయడవివి డచి పోవలసినదని యాజ్ఞాపించినటులను నాయుత్తరువుప్రకార మాతడట్లు విడిచిపోయెననియు చెప్పబడియున్నది. ఈవిధము గనే యీగ్రంథకర్తలనేక సంవత్సరములపిదప వ్రాసియుండు టంబట్టి యొకదానికి మరియొకటిగ భ్రమసియున్నారు. మ రియొక చిన్న దృష్టాంతమును జెప్పుచున్నాను. కొందరు గ్రంథ కర్తలు చెప్పుటలో శ్రీకృష్ణులవారుజన్మించినపు డు గాఢాంధకారమనియు నపుడు విశేష వర్షము గురి యు చుండిన దనియును, మరికొందరు జెప్పుటలో నారాత్రి యతిస్వచ్ఛమైనదియై యుండినదనియుం జెప్పిరి ఈవిధముగ నై విషయములయందు గ్రంథ కర్తలు భిన్నాభిప్రాయులై యుండుటచేత జదువరులకేవిధమైన చెరుపును సంభవించ క పోయినను హిందూమతస్థులందరి దురదృష్టముకొలది నా గ్రంథకర్తలు విశేష పాతిత్య కరములగు నట్టియు వచించు

టకు లజ్జాకరములగు కేవలాసత్యదోషములకు గాతు)త్రి యున్నారు. బహుశః ఈగ్రంథకర్తలు యుక్తాయుక్త వి చార సమర్థత లేనివారుగ గానవచ్చుచున్నారు.

ఈసంస్కృతపురాణములను దెనుగు- అరవము- మొ దలగు దేశీయభాషలలోనికి మార్చిన కవీశ్వరులు- మరియు నవిరేకులుగ గనిపించుచున్నారు వీరనేః విషయములలో శ్రీ కృష్ణులవారి చారిత్రములోనియొక భాగమునున్న- ఇది యెట్టిసంగతి సందర్భములలో నెటులజరిగినదో ముందు వె నుకలజూచి దానిం గనిపెట్టుటకేవిధమైన శ్రమను బొందక క్రొత్త క్రొత్త ప్రబంధములనే కల్పించిరి. ఆకథలన్నియు న సత్యపు కథలగుటయెకాక వారివారికిగల యభిరుచిని- యు ద్దేశమును శక్తినిబట్టి కేవలము స్త్రీలోలత్వమును జెప్పు క థలై యున్నవి. వారివారి మనోభిప్రాయముల ననుసరించి చె ప్పబడినట్టియు- నసత్యములైనట్టియు- శ్రీకృష్ణులవారివిష యమై మనము దురదృష్టము కొలది జేయుచున్న విరుద్ధ భావన లెవ్వియో యీక్రింద జెప్పుచున్నాడను.

(1. శ్రీకృష్ణులవారొక నాటి వెన్నెలకాలమందు రాసక్రీ డలయందాసక్తులయి యుండినటులను అందు దామును యౌ వ్వన వతులగు స్త్రీలును గలసి విహరించినటులను నాయువ తులు, శ్రీకృష్ణులవారి యందు మోహపరవశలైనటులను జె

ప్పబడియున్నది. ఈరాసక్రీడ వృత్తాంతము భాగవతము నం దు విపులముగను, హరివంశ విష్ణుపురాణములయందు స్వల్పముగను గలదు. ఇట్టివి మరికొన్ని దేశములు భాగవతము నందు జెప్పబడియున్నవి.

(2) శ్రీకృష్ణులవారొక సరస్సునందు వస్త్రహీనలై జలక్రీడలాడుచుండు యువతుల వస్త్రములనపహరించినటుల్లను

(3) కొందరు బ్రాహ్మణస్త్రీలు శ్రీకృష్ణులవారిం జూచి మోహించినటులను గలదు.

ఇట్టి గ్రంథకర్తలయొక్క యసందర్భపు టూహాలతో గూడి యున్న యీ కథలను గొంచెమైన తెలివిగలిగి యుక్తాయుక్తవివేచనముం జేయువారికెవ్వరికిని నమ్ముటకు వీలుండునా! ఒక వేళ నాకథలు గ్రంథకర్తలయొక్క కేవలామాయికమైన పొరబాటులై బహుశః యుండియుండవచ్చును- ఈపైమూడు విషయములు జరుగునప్పటికి శ్రీ కృష్ణుల వారికి 11 సంవత్సరముల వయసుగలిగి యుండెను. అట్టి బాల్యావస్థలో నుండు వారికి సంభోగవాంఛ గలిగి యుండునా! అయితే వారు సాధారణమైన బాలురు కారనియు విష్ణు-శేష-మూల విరాట్టుయొక్క యవతారమని కొందరు జవాబు జెప్పవచ్చును. గాని యీవిధమైన జవాబా కథలకు జలహీనతనే కలుగజేయుచున్నది. మూల విరాట్టుని యవతారమును ధరించినవారు

ను మనకు సృష్టికర్తయు-రక్షకుడును-సన్మార్గ ప్రదర్శకుండును
ఇంద్రియాతీతుండును-దోష శూన్యుండును-అనవధి కాతిశయ
కళ్యాణ గుణగణుండును-సర్వజ్ఞుండును-జితేంద్రియుండునని ప్రసి
ద్ధిని వహించిన శ్రీకృష్ణుల వారు పాపకరమైనట్టియు- మో
హోద్రేకమును గలిగించునట్టియు నిట్టి కార్యములను జరిగిం
చియుందురా, విచారింపుడు ! అది నిజము కాదు. వారియేమ
ున నప్పటి కాలములోను, నరుదుగ నిప్పుడును, పర్వత వనవా
సులలో స్త్రీపురుషులు కలిసి యాడుట- పాడుట-మన దేశమం
దు మామూలయి యేయున్నది. ఇంతియెకాక నాగరికతగల
యూరోపు దేశస్థులకు సహా యటుల నాడుట మామూలు
మర్యాద యయియున్నది. ఈగ్రంథకర్తలట్టి ప్రజల యొక్క
మామూలు మర్యాదలను దెలియని వారై యారాస క్రీడకు
పరీతార్థమును దీసికొనిరి.

ఇక స్త్రీలయొక్క వస్త్రములనపహరించిన విషయము
శ్రీకృష్ణులవారు బాల్యావస్థ ననుసరించి వినోదార్థముగ న
ుల జరిగించి యుండవచ్చును. లేదా స్త్రీలు వస్త్రవిహీనలై
రస్సులందును- నదులందును- స్నానములు చేయకూడదని
పదేశము జేయుకొరకు బహుశః అటుల జేసియుండవచ్చు
ు.

ఈవిధముగు నభిప్రాయము చేతనే బ్రాహ్మణ స్త్రీలయొ

డనాగోపబాలురలో నాహ్లాదకరమగు- సౌకుమార్యము గల యాపిల్లవానిని జూచి యతిప్రేమ గలవారై యుండవచ్చును మగవారికంటె స్త్రీలు పిల్లలను జూచునప్పుడు హెచ్చుగ ప్రేమించుట స్వభావ గుణమైయున్నది. ఇంక నా భగవంతుని విషయమును జెప్పనేలా!

అవతారముల విషయమై అనిబిసంటు దొరసాని ఇచ్చిన యుపన్యాసలలో శ్రీకృష్ణులవారి విషయమై యాయనకులకు గల నిష్కల్మషమైనట్టియు భక్తియుక్తమైనట్టియు-ప్రేమను వ్యక్తపరుచుట కింతకంటె చెప్పుట కక్కువ మాటలు లేవని చెప్పుచు నీవిషయములలో విశేష పరిశీలన జేసినచో సంభోగ వాంఛతో గలిసిన యుద్దేశ మేమియు లేనటుల స్పష్టపడగలదని చెప్పెను.

పై మూడు విషయములు' ధీరేంద్రనాద్'గారు కూడ నిరుత్తరమగు విధమున నాక్షేపించిరి. వారు చెప్పిన దేమనిన ఈయంశములలో నేమాత్రము నిజముండినను మహాభారతమునందు సభాపర్వమున శిశుపాలుడు శ్రీకృష్ణులవారిని నోటికి వచ్చినటుల దూషించునపుడు వారియొక్క యిట్టి వ్యభిచారములనుగురించి దూషింపక యుందునాయని నుడివెను. మరియు నా గ్రంథమునం దెచ్చటను శ్రీకృష్ణుల వారు స్త్రీలోలులని చెప్పబడి యుండలేదనియు అంతకు నవీనగ్రంథములగువి

పురాణములో గూడ నా ప్రశంస యేమియు లేదనియు చె
ప్రు.

మరియు రాధవిషయమున మిగుల నవమానకరమ
నొక గొప్ప తప్పభిప్రాయము గలదు చూడుడు- రాధ
యనునామము భారత భాగవత హరివంశ, విష్ణుపురాణము
లందెచ్చటను గానరాకపోయినను బ్రహ్మవైవర్తపురాణ
మందు రాధయను నామెతో శ్రీకృష్ణులవారికొక సంబం
ధముగలదని గొప్ప తప్పుకథ వ్రాయబడెను- ఈక్రొత్తపు
రాణ మసందర్భములగు మనుష్యులయొక్క యూహలకు మిం
చిన వ్యవస్థలతో నిండియున్నది. అయిన శ్రీకృష్ణులవారికి
నమామ భార్యయనియును శ్రీకృష్ణులవారియందు విశే
షమోహపరవశయై యున్నదనియును జెప్పబడి యున్నది.
ఆమెవిషయమై ధీరేంద్రనాథ్ పాల్ గారు కవులయొక్క క
ల్పనాశక్తి దప్ప మరియొకటి కాదని చెప్పుచున్నారు. అయి
న ఆమెవిషయము కవులయొక్క పెద్దతప్పయియె యుం
డవలెను. గాని యామె కేవల కవికల్పిత కాదని నాయభిప్రా
యము ఎలనంటె ఆమెవిగ్రహము శ్రీకృష్ణ విగ్రహమునకు
ప్రక్క నుంచబడి యుండి యాదేశమునందంతట నారాధింపబ
డుచున్నయది, కవికల్పితమైనచో నటుల నారాధింపబడు
నా! నేనామెను శ్రీకృష్ణులవారియొక్క ముఖ్యభార్యయగు

రుక్మిణియేయని దృఢముగను, నిస్సంశయముగను జెప్పగల ను. మరికొన్ని దేవాలయముల యందిరుపార్శ్వముల యం దును రుక్మిణీ సత్యభామలుగల శ్రీకృష్ణులవారారాధింపబ డుచున్నారు. గాని నాకు దెలియవచ్చిన స్థలములలో నెచ్చ టను రుక్మిణీదేవిమాత్రముగల శ్రీకృష్ణుల వారారాధింపబ డలేదు. రుక్మిణియనగా లక్ష్మీదేవియొకరు యవతారమేయ ని మనకందరికిం దెలిసినదియేకదా అట్టిలక్ష్మితో మాత్రము వారినారాధించుటకుగా నీరెండు విగ్రహములుగల యాల యములంగట్టించి ప్రజలు పూజింపగోరి యుండవచ్చును- ఈ విధముగ స్త్రీపురుష ద్వంద్వనామముల నుచ్చరించునపుడు స్త్రీనామమును ముందుగాను పురుషనామమును వెనుకగా ను నుంచిచెప్పటకలదు. అనగా సీతారామ' లక్ష్మీనారాయణ పార్వతీపరమేశ్వర, అనువిధములుగలవు. అట్టిద్వంద్వ నా మములు చెప్పునప్డతిసులభముగ నుచ్చరింపబడుచున్నవి. అయితే రుక్మిణియను నామము శ్రీకృష్ణనామముతో బై నా మములవలె సులభముగ బలుకబడదు- మరియు పూర్వపు పాతశాస్త్రవిరోధమనియుం జెప్పదురు

లక్ష్మీ సహస్రనామములలో రాధయనుపేరు లక్ష్మికింగల దు. ఆసహస్రనామములలో శ్రీకృష్ణనామముతో రాధయ ను పేరుతప్ప దదితర నామము లంతసులభముగ కలిపి పలు

కబడవు. గనుక మనకు బూర్ణమైనసంతృప్తి గలుగునటుల
రాధాకృష్ణులు లక్ష్మీనారాయణుల యవతారములని పూ
జింపబడుచున్నారు. ఈవిధముగ నాదిని రుక్మిణీ శ్రీకృష్ణు
లవారును బ్రజలచే బూజింపబడుచుండిరి. భాగవతాదిగ్రంథ
ములయందు శ్రీకృష్ణులవారు రుక్మిణీయుక్తముగనో లేక
యష్టభార్యలతో గలసియో. లేక మరియేవిధముగ బూజిం
పబడవలెనో చెప్పబడి యుండలేదు. ఆగ్రంథములు పుట్టినయ
నేక శతసంవత్సరముల పిదపనేకాక రాధా కృష్ణులవారిప్రతిష్ఠ
కుబిదప మరికొన్ని వందలసంవత్సరములకు బ్రహ్మవైవర్తపురా
ణకర్త కానాలుగుపుస్తకములలో రాధయను పేరుకానరానం
దున దనబుద్ధికొలంది నీరాధ యెవరని యోచించుటకు స్వల్ప
బుద్ధితో బ్రయత్నించి యుండవచ్చును. అటులనతడు పరిశీలిం
చునపుడు ప్రారబ్ధముకొలది శ్రీకృష్ణులవారి మేనమామయగు
'రాయన' యనునతని భార్యను రాథయనుబేరుగలిగి యుండిన
ట్లుగని పెట్టబడెను. అప్పటికి భాగవతములో జెప్పబడిన రాసక్రీ
డ మొదలగువ్యభిచారకార్యముల నొప్పించుటకు దగినట్టియునస
త్యములైనట్టియు. వారివారికి దోచినట్టికథలతో నతనిమనస్సున
నిండియుండవచ్చును అందునుంచియతడు 'రాయన'యను వాని
భార్యయగు రాథను శ్రీకృష్ణులవారితో గలసి పూజింపబడుచుం
డినలక్ష్మికిమారుగ బొరపాటుపడి యుండవచ్చును. తననమ్మకము

నుశ్రృథపరచుటకుగాఁ బై నాలుగు పురాణములయందు జెప్ప బడిన రుక్మిణీ శ్రీకృష్ణులకంటే రాధాగోపాలకృష్ణులధికులని జె ప్పనంతవరకు కథనుబోనిచ్చెను. రుక్మిణీదేవియె రాధయని జె ప్పటకుట్టా కేమి యాధారముగలదని సభికులగు మీరాయనన్న డుగవచ్చును. అనేక శతసంవత్సరములు గడచిన పిదపనిప్పటి కాలి ప్రజలయొక్కయు దేశముయొక్కయు- చారిత్రలుంబ్రబ డకుండిన కాలములో ననేక సంగతులు నుతరాము మరిచి పోవుటయు- చాలామట్టుకు మరిచిన విషయములలో నందుకు బదులు క్రొత్త సంగతులు చేర్చబడుటయు వాడుకలో గలదు. ఇందుకు దృష్టాంత మేమనిన మనలో గొంతమంది తప్ప శ్రీజగ న్నాథమనగ నేమియో తెలియనివారు కలరు. ఆక్షేత్రము నందు శ్రీజగన్నాధుడు-సుభద్ర-బలరాముడు ననుమూడు వి గ్రహములు గలవు మధురలో బుట్టి పెరిగిన శ్రీకృష్ణ బలరామ సుభద్రలయొక్క విగ్రహములే యివియని సాధారణముగనవి వేకపు నమ్మకముగలదు. ఇచ్చటమధురలో సుభద్ర-శ్రీకృష్ణ- బలరాములకు చెలియలై యున్నది. జగన్నాధునికి నామె భార్యయైయున్నది. ఇంక మూర్ఖపునమ్మకమేమనిన శ్రీకృష్ణు లవారు చెలియలనే జగన్నాథములో భార్యగా బొందెన వి యున్నది. ఈకథ మేనమామ భార్యయగు రాధ కథకంటె మిక్కిలి యసంగతము కదా! అయితే నటాల

కాదు. శ్రీకృష్ణులవారు జన్మించుటకు బూర్వమే యీజగన్నా
థ క్షేత్రముగలదు. ఇప్పుడు జగన్నాథములో బూజింపబడు
చుండిన విగ్రహములనే బలరాముడు-నర్జునుడును-దీర్థయాత్ర
లకు వెళ్లినప్పుడచ్చోటునకుంబోయి పూజించిరను సంగతి మన
మిప్పుడు చదివి తెలిసికొనగలము. అయితే, ఈపొరపాటు
లసంభవించినదో విచారింతము. తమ సంతానములో మొగ
శిశ్వనికి బురుష దైవనామమును యాడుబిల్లకు స్త్రీ దేవతా
నామమునుంచుట మనలో నాచారమైయున్నది. ఇందుకుని
దర్శన మేమనిన శ్రీసీతారామ నామములలో నొకని కుమా
రునికి రామనామమును-కుమార్తెకు సీతా నామమునుంచు
టగలదు గదా! ఆమొదటి సీతారాములు భార్యాభర్తలై
యుండినను వారిపేర్లను ధరించిన యీబిడ్డలిద్దరు సోదరీ సో
దరులయి యున్నారు. ఈవిధముగనె వారి జననీ జనకులు త
మ బిడ్డలకు జగన్నాథములో బూజింపబడుచుండు శ్రీకృష్ణ
బలరామ సుభద్రల యొక్క నామములనుంచి యుందురు.
శ్రీకృష్ణుల వారు తనచెలియలను భార్యనుగా జేసికొనెనను న
మ్మక మెంత లజ్జాకరమైనటువంటియు- పాపహేతువైనటువంటి
దైయున్నదో మీకేవిదితమగును. ఈవిధముగనె బ్రహ్మావై
వర్త పురాణ కర్త రాధయను నామముగల మరియొక స్త్రీని
లక్ష్మియను నామమునకు బదులుగ మనస్ఫూర్తిము తొలది పొరపా

టుపడి మనమిప్పుడా గ్రంథములో జూచురీతి నసత్యమైనట్టి యు-దుష్టమైనట్టి యభిప్రాయమును బొందుటకు గారణమై నది.

శ్రీకృష్ణులవారినిగురించి మరియొక స్వల్పాంశమును మీకు జెప్పవలసియున్నది. వారెనమండ్రు స్త్రీలను వివాహమాడినట్లున్నది. ఇందుకునేనాక్షేపింపను గాని రుక్మిణీ సత్యభామా జాంబవతులకు వినాగా మరికొందరు భార్యలుండినటుల మహాభారతమునందు జెప్పబడి యుండలేదు. రుక్మిణీదేవికంటెనొకగిద్దరు స్త్రీలను వారు వివాహ మాడియుండినను ఎనమండ్రు భార్యలుండినటుల దగిన నిదర్శనములేదు. అయినప్పటికి నొకభార్యకంటె నెక్కుడుమందిని వివాహ మాడినటుల మనమొప్పక తప్పదు. కాన నేల నటుల జేసికొనిరో చూచెదము. ఆకాలములో నిరాకరింప బడదగని రెండాచారములు గలవు.

(1) ప్రతిరాజును వివాహమైనవాడు గాని కానివాడుగాని- యొకరిచే గోరబడినపుడు స్వయంవరమునకు దప్పకబోవలసిన దనియు- స్వయంవరమందా చిన్నదానిచే వరింపబడినచో నామెను దప్పక వివాహ మాడవలసినదనియు నాచారము గలదు.

(2) ఒక రాజు తనను జయించిన రాజునకు దనకు మాత్రనుగాని- చెలియలనుగాని వివాహముకొరకు సమర్పించుట గలదు. అటుల సమర్పించుట, జయించబడిన వాని కిష్టముమీదనున్నదిగాని- జయించిన వానికి మాత్రమాచిన్న దానిని సంగ్ర సందర్భములనుబట్టి తనకుగాని తన సోదరునికి గాని తనకుమారునికిగాని వివాహము జేసికొనుట విధివిహితమైనయాచారమై యున్నది.

ఇట్టి యాచార సందర్భముల వలన నొక భార్యకె నెక్కుడు మంది వివాహ... యుండవచ్చును ... స్త్రీలోలత్వముచేత గాదు. లేనా, మీద గనపరచబడిన విషయములలోవలె గ్రంథకర్తల పొరబాటులుగనైన ...డవచ్చును.

మరియొక చిన్న గాధ కలదు. శ్రీకృష్ణులవారు గోరాజగు నరకాసురుని సంహరించి యాతని యధీనములో ... యువతుల నందరిని వివాహ మాడినట్లున్నయది. ఈ ఖ్య, బహుశః అతిశయోక్తికొరకు గ్రంథకర్తలచే బది ...వేలు మొదలు పదియారువేల నూటివరకు జెప్పబడి ...న్నది. ఈపొరపాటెటులజరిగినదో చూచెదము. ఆస్సీ ...రిక నారకాసురుడు పతిలేక- పోషకుడై యుండెను.

అగుడు సంహరించబడగానే స్వభావముచేతనే శ్రీకృష్ణులవారియం దాపోషకత్వము వ్యాపించినది. సంస్కృతమునందు పతిశబ్దమునకు 'ప్రభువు'- 'పోషకుడు'- 'భర్త' యనునర్థము లు గలవు 'భూపతి'- 'గృహపతి'- 'జనపతి'- ఇత్యాదులు. కాని నీతిలేని శృంగార కథలతో నిండియుండిన మనస్సులు గల గ్రంధకర్తలు పతి శబ్దమునకు బోషకుడను నర్థముంజేయక భర్త యను నర్థముంజేసి యుందురు

ఇంక పశ్చిమదేశపు విద్వాంసులగు 'మాక్సుముల్లరు' మొదలగు వారిచే నెవరియొక్క యుపదేశము లైకకంఠ్యముగ మెచ్చుకొనబడి యుండినవో యట్టి శ్రీకృష్ణులవారి విషయమై మన కిదివరలో గలిగియున్నట్టియు- లజ్జాకరము లైనట్టియు- వారివారికి దోచినటుల జెప్పబడినట్టియు- వారి వారి యిష్టము కొలది విరివిజేయబడినట్టి విపరీతభావ ములను మీకు శక్యమైనంత వరకు బోధపడునటులుగ వ్యక్త పరిచితిని దలంచుచున్నాడను. మనవారిలో ననేకులు అనగా గతించిన మూడు కాలముల యందుండువారు- పాపభూయిష్ట ములైనట్టియు నీతిని చెప్పబడినట్టియు నసత్యములైనట్టియు కానీ తప్పులను జేసియుండునటుల గనిపెట్టుట మిగుల లజ్జాకర మై యున్నదిగదా;

కనుక హితులారా; నాచే జెప్పబడిన యుక్తులను బరి[illegible]

ఁను మనస్సునందుంచి మనకిదివరకు శ్రీకృష్ణులవారివిషయ మై కలిగి యున్నయట్టి విపరీత భావనల నొకవైపు త్రోసి వే సి సత్యమైనట్టియు పూజ్యమైనట్టియు నడవడిని మనమంద ర మవలంబించ వలసినవారమైయున్నారము.

వేం॥ శ్యా॥ రం॥

బొబ్బిలి.




Sri Rangaraya Vilasa Press Printed by
K, Padmanabha Patnaik. Bobbili, 1904.